# కేరళలో
# కమ్యూనిస్టు ప్రభుత్వ
# 28 నెలల
# ప్రజాపరిపాలన


సి. అచ్యుతమీనన్
(కేరళ మాజీ హోంశాఖా మంత్రి)



విశాలాంధ్ర ప్రచురణాలయం
బకింగ్‌హాంపేట విజయవాడ

# కేరళలో
# కమ్యూనిస్టు ప్రభుత్వ
# 28 మాసాల
# ప్రజాపరిపాలన

సి. అచ్యుతమీనన్
(కేరళ హోంశాఖ మాజీ మంత్రి)



విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ.

ప్రచురణ నెం. ౪౬౬.
అక్టోబరు '59

వెల : 19 న. పై.



ముద్రణ :
స్వతంత్ర అర్టు ప్రింటర్సు,
విజయవాడ.

కేరళలో రాష్ట్రపతి జోక్యం కలిగించుకొన్న తరువాత, ఒక పత్రికా ప్రతినిధుల గోష్టిలో, మాట్లాడుతూ, పండిట్ నెహ్రూ కమ్యూనిస్టు ప్రభుత్వం కేరళ పరిపాలనలో "ఆశ్చర్యకరమైన వైఫల్యం" పొందిందని చెప్పారు. కాని మరునాడే, ముందురోజు అభిప్రాయాన్ని కొంత మార్చుకొని, కమ్యూనిస్టు మంత్రివర్గంయొక్క సాంఘిక , ఆర్థిక విధానాలను గురించి వ్యాఖ్యానించలేదని, తమ విధానాలకు అనుగుణ్యంగా ప్రజా బాహుళ్యాన్ని సమీకరించ లేకపోయారని నెహ్రూ అన్నారు. ఏది ఎలాగున్నా, యితర రాష్ట్రాలలోని కాంగ్రెస్ మంత్రి వర్గాలకన్నా కేరళలో కమ్యూనిస్టుప్రభుత్వం, అధికంగా ఏమీ సాధించ లేదని, దాని గొప్ప ఏమీ లేదని, చర్విత చర్వణంగా చాటడం మొదలెట్టారు.

అయితే కమ్యూనిస్టు మంత్రివర్గం అమలులోనికి తీసుకువచ్చిన ప్రతి చట్టాన్ని వ్యతిరేకిస్తూ, కేరళ ప్రభుత్వాన్ని దుయ్యబట్టడం, దాని ప్రతిచర్యని సుతలామూ ఖండించడమే కేరళ కాంగ్రెస్ తన ముఖ్య కార్యక్రమంగా ఎందుకు పెట్టుకుంది ? కాని ఈ ప్రశ్నకి సమాధానం దొరకడం దుర్లభం. కారణం కేరళ కాంగ్రెస్ విమర్శలో నిజాయితీ లేకపోవడమే. ఆఖరికి పార్లమెంటులో, పండిట్ నెహ్రూ, కె. పి. మాధవన్ నాయర్ ఈ వాదననే పునరుచ్చారణ చేశారు. ఇన్నిసార్లుగా ఇంతమంది, కేరళ మంత్రివర్గం ఏమి సాధించలేదని, దాని పరిపాలనలో ఘనత ఏమీ లేదని పదేపదే వల్లిస్తున్న విమర్శదృష్ట్యా, కేరళకమ్యూనిస్టు మంత్రివర్గం 28 నెలల కార్యక్రమాన్ని, దాని సాంఘిక – ఆర్థిక విధానాన్ని కూలంకషంగా విమర్శనాత్మకంగా పరిశీలించి, కేరళ ప్రజల జీవితంలో ఎటువంటి మార్పులకు పునాదులు వేసిందో గమనించవలసిన ఆవశ్యకత వుంది.

అయితే ప్రప్రథమంగా ఒకవిషయం దృష్టిలో ఉంచుకోవాలి. ఇవాళ కేరళరాష్ట్రంలో, సంవత్సరాల తరబడి వేధించుతున్న బీదతనం, నిరుద్యోగం మున్నగు మూల సమస్యలకు, ఈ 28 నెలల పరిపాలన లోను కేరళ కమ్యూనిస్టు మంత్రివర్గం, పరిష్కార మార్గాలు కను గొన్నాదా అంటే, లేదు అని చెప్పటానికి నాకెలాంటి సందేహాము లేదు. మేము 28 నెలలు కాకుండా, 5 సం॥ పూర్తిగా అధికారంలో వుండినా ఈ మూల సమస్యలను వెంటనే పరిష్కారం చేసి వుండ లేకపోయేవాళ్ళం. ఒక రాష్ట్రం సాంఘిక ఆర్థిక వ్యవస్థలో ప్రధాన మైన మార్పులు క్షణాలమీద తీసుకురావటం అల్లావుద్దీన్ దీపంలాగ, తలుచుకోగానే సాధించే మ్యాజిక్ లాంటిదికాదు. ఇంకోవిషయంకూడా విమర్శకులు మరువరాదు. కేరళ రాష్ట్ర ఆర్థికవ్యవస్థ స్వతంత్ర ప్రతి పత్తి కలిగినదికాదు. అందుచేత మొత్తం భారతదేశ ఆర్థిక గమ నానికి విరుద్ధంగా, అధిగమించి, పురోగమించడానికి వీలులేదు. ఈనాడు మనదేశ ఆర్థికాభివృద్ధి రెండవ పంచవర్ష ప్రణాళికలో నిర్దేశించబడిన విధానాలపై ఆధారపడి వుంటుంది. అందుచేత రెండవ పంచవర్ష ప్రణాళికలో సూచించబడిన మార్పులకన్న, అధికంగాను, విభిన్నంగాను, కేరళరాష్ట్ర ఆర్థిక విధానాన్ని సంస్కరించగలం అను కోడం పొరపాటు. రెండవ పంచవర్ష ప్రణాళికలో నిరుద్యోగం కొంత వరకైనా నిర్మూలింపబడి, దేశాదాయం కొంత అభివృద్ధిచెంది, వ్యక్తి యొక్క తలసరిఆదాయం పెరిగిందో లేదో అందరకు తెలిసినవిషయమే. అందుచేత కాంగ్రెస్ మిత్రులు, కేరళలో మేము మా 28 నెలల పరి పాలనలోను, నిరుద్యోగం రూపు మాపలేదని, పేదరికాన్ని నిర్మూలించ లేదని విమర్శ చేసేముందు, నేను పైనచెప్పిన సత్యాలు గుర్తుకు తెచ్చు కోవడం శ్రేయస్కరం.

అలాగైతే కమ్యూనిస్టు పరిపాలన కేరళలో ఎటువంటి మార్పులు లేకుండా, ప్రజలకు ఏవిధమైన లాభాలు చేకూరలేదా అన్న ప్రశ్న వుదయిస్తుంది. అదే నిజమైతే కేరళలో కమ్యూనిస్టు పరి పాలన విఫలమైనట్లే. కమ్యూనిస్టు మంత్రివర్గం సాధించినదల్లా ఏడం

చెయ్యి తీసి పుర చెయ్యి పెట్టడమే అయితే దానివలన వారికే ప్రయోజనం శూన్యం. కాని కమ్యూనిస్టు పరిపాలనను అలా వ్యాఖ్యానించడం శుద్ధతప్పు. కమ్యూనిస్టు ప్రభుత్వం రాష్ట్రపాలనలోను, ప్రభుత్వ విధానాలలో చాలా ముఖ్యమైనమార్పులు తీసుకురావడమేకాకుండా, భవిష్యత్తు అభివృద్ధి ప్రోత్సాహకరంగాను, ఆశాజనకంగాను వుండేటట్లు కొన్ని పునునాలు వేసింది. కేరళ ప్రజలు తమ దైనందిన జీవితంలో కొంతవరకు ఈ నూతన విధానాల ఉపయోగం, ప్రయోజనం అప్పుడే గుర్తిస్తున్నారు. అయితే వాటి పూర్తి ప్రభావం ప్రస్ఫుటంగా ప్రజాజీవితంలో, రాష్ట్రాభివృద్ధిలో గోచరించడానికి కొంత కాలం అవసరం.

పండిత నెహ్రూ, మాధవన్‌నాయర్ నుడివినట్లు కేరళలో కమ్యూనిస్టు ప్రభుత్వం అనుసరించినది, ఆచరణలో రూపొందించినది చాలవరకు కమ్యూనిస్టు విధానాలు, కార్యక్రమం కాకుండా కాంగ్రెస్ అంగీకరించి ఆచరణలో ప్రవేశపెట్టడానికి కొన్ని రాష్ట్రాల్లో కాంగ్రెసు మంత్రివర్గాలు పూనుకొన్న విధానాలే. ఈ విధానాలు అసలు జాతీయోద్యమంలో రూపొందించబడిన జాతీయకార్యక్రమమే. గత పాతిక సంవత్సరాలలోను, జాతీయ ఉద్యమంలో ఆమోదించబడిన ఆర్థిక రాజకీయ విధానాలనే కేరళ రాష్ట్ర పరిస్థితుల దృష్ట్యా ఆచరణలో పెట్టడానికి కేరళ కమ్యూనిస్టు ప్రభుత్వం ప్రయత్నించింది.

కేరళలో ఏ పక్షం అధికారంలో వున్నా అది ప్రధానంగా సాధించవలసినది ఆర్థికంగా వెనుకబడి వున్న రాష్ట్రాన్ని కదిలించి పారిశ్రామికవంతంగా అభివృద్ధి చెందించి, రాష్ట్రం సత్ సంపన్నంగా సాగిపోయే కార్యక్రమం చేపట్టాలి. చరిత్రచే నిర్దేశించబడిన ఈమహత్తర కార్యక్రమం సాధించటానికిగాను కమ్యూనిస్టుపార్టీ మూడు ప్రాథమిక విధానాలను అనుసరించడానికి ప్రయత్నించింది.

1. కేరళ రాష్ట్రంలోని, సహజ వనరులన్నిటిని పూర్తిగా వినియోగపడేటట్లుగా, సమగ్రపథకాన్ని రూపొందించి, దానిని ఆచరణలో పెట్టడానికి చర్యలను తీసుకోవడము.

2. ఈ సమగ్ర పథకాన్ని సఫలీకృతంగా అమలుపరచుకోడా నికి అనువైన సాంఘిక పరిమాణాలను తీసుకురావడం.

3. అదేవిధంగా, సమగ్ర పథకం అమలుపర్చడానికి, సాంఘిక పరిణామాలను తీసుకురావడానికి, అనువైన మార్పులను, ప్రభుత్వ యంత్రాంగంలోను, పరిపాలనా పద్ధతులలోనూ ప్రవేశపెట్టడం.

## ఆర్థిక ప్రణాళిక - రెండు విషయాలు

ప్రస్తుతం ఆచరణలోనున్న ప్రణాళిక ఏ విధంగా అమలుజరుగు తున్నది ? రెండవది : ప్రణాళిక తరువాత దశను, అధిక ప్రయోజన వంతంగా వుండేటందుకు తీసుకొనబడిన చర్య లేమిటి ? నిష్పాక్షిక విమర్శకులు ఎవరైనా ఈ రెండు కోణాలనుంచి కమ్యూనిస్టు మంత్రి వర్గ కార్యకలాపాలను సమీక్షిస్తే, దాని విధానాలు, పద్ధతులు గర్వింపతగ్గవిగా వున్నాయని మెచ్చుకోక తప్పదు.

అమలులోవున్న ఆర్థిక ప్రణాళిక లక్ష్యాలను సాధించడంలో కమ్యూనిస్టు మంత్రివర్గం అశ్రద్ధ వహించిందని అపవాదు మోపారు. అంతేకాదు, కాంగ్రెసువారి వ్యతిరేక ప్రచారంలో యిది ఒక ప్రధాన స్థానం వహించుతోంది. కేరళ రాష్ట్ర ప్రణాళిక అంతకుముందు తిరు వాన్కూరు-కొచ్చిన్ రాష్ట్రం, మద్రాసు రాష్ట్రంలోను మలబారు జిల్లాలను సమన్వయం చేయడంవల్ల ఏర్పడిన ప్రత్యేక పరిస్థితుల కను కూలంగా రూపొందించవలసిన అవసరం, దానితోడు, కమ్యూనిస్టు మంత్రివర్గం క్రొత్తగా అధికారంలోనికి రావడం, ప్రతిపక్షాల సహాయ నిరాకరణమున్నగు విషయాలను గుర్తించుకొని సత్యాసత్యములను పరిశీ లిస్తే ప్లానుకు 1957–'58 సం॥ కేటాయించిన మొత్తంలో నూటికి 84.5 వంతులు ఖర్చుచెయ్యడం ఒక ఘనమైన విజయమే నని సగర్వంగా చెప్పవచ్చు. 1956 – '57 సం॥లో నూటికి 58 వంతులు మాత్రమే ఖర్చుపెట్టడం జరిగింది. అప్పుడు రాష్ట్రం, రాష్ట్రపతి పాలనక్రింద వుందని కొందరు వాదించవచ్చు. కాని మొదటి ప్రణాళిక పూర్తి కాలంలో తిరువాన్కూర్ – కొచ్చిన్ రాష్ట్రంలో నూటికి 85 వంతుల

కన్న తక్కువమాత్రమే వినియోగపర్చగలిగారు. 1958 - '59 సం॥ కమ్యూనిస్టు మంత్రివర్గం నూటికి 95 వంతులవరకూ ఖర్చుచేయ గలిగింది.

అందులోను కొన్ని శాఖలను ప్రత్యేకంగా పరిశీలిస్తే ఈ అభివృద్ధి మరీ స్పష్టంగా కనిపిస్తుంది. వ్యవసాయ శాఖ క్రింద మొదటి ప్రణాళిక పూర్తికాలంలో తిరువాన్కూరు-కొచ్చిన్ రాష్ట్రంలో 100 కి 45 వంతులు మాత్రమే వినియోగిస్తే, కమ్యూనిస్టు మంత్రివర్గం అధికారంలోనికి వచ్చిన తరవాత మొదటి ఏడు 100 కి 70 వంతులు, రెండవ ఏడాది 75 వంతులు ఖర్చు చేసింది.

రెండవ ప్రణాళికలో మొదటి మూడు సంవత్సరాలు కలిపి వెచ్చించవలసిన డబ్బు, వ్యయపరిచిన మొత్తం, మిగతా రాష్ట్రాలతో సరిపోల్చిచూస్తే, మద్రాసురాష్ట్రం ప్రథమ శ్రేణిలోను, కొన్ని యితర రాష్ట్రాలతోపాటు కేరళ ద్వితీయ శ్రేణిలోనువుంది. ఇది ఏమిటి సూచిస్తుంది ? ప్రణాళికా లక్ష్యాలను సాధించటంలో ఇతర రాష్ట్రాల కన్నా కాంగ్రెస్ మంత్రివర్గం ఆధ్వర్యాన తిరువాన్కూరు, కొచ్చిన్ రాష్ట్రం మొదటి ప్రణాళికా కాలంలో బాగా వెనుకపడితే, కమ్యూనిస్టు మంత్రివర్గం అధికారానికి వచ్చిన మొదటి రెండు సంవత్సరాలలోనే, త్వరిత గతిని ప్రణాళికా కార్యక్రమం చురుగ్గా సాగి, యించుమించు అగ్రస్థానాన్ని అందుకొంది. మరి యిది కాంగ్రెస్ పరిపాలనా విధానంకన్న, కమ్యూనిస్టు పరిపాలన సక్రమమైనదని, మెరుగని రుజువు పరుస్తున్నదో లేదో యితరులే చెప్పగలరు. మరి కారణమేమోకాని, ఈమధ్య ప్లాను కార్యక్రమం చురుకుగా సాగడం లేదని, మందకొడిగా సాగుతున్నదని అదే పనిగా చేసిన విమర్శనలు మాత్రం వినరావడం లేదు. కమ్యూనిస్టు మంత్రివర్గ బర్తరఫ్ చేయబడిన తరువాత 1959, ఆగస్టు 15 న స్వాతంత్ర్య దిన సందేశంలో, కేరళ గవర్నరు కేరళ రాష్ట్రం ప్రణాళిక లక్ష్యాలను సాధించడంలో గొప్పవిజయం సాధించినదని సగర్వంగా చెప్పారు.

కేరళ రాష్ట్ర రెండవ పంచవర్ష ప్రణాళిక, కేరళ రాష్ట్ర అవసరాలు, దాని ప్రత్యేక పరిస్థితుల కనుగుణ్యంగా తయారు చేయబడ

లేదు. ఇక ఒక్క తిరువాన్కూరు-కొచ్చిన్ రాష్ట్ర ప్లాను వ్యవహారం పరిశీలిస్తే, దాని అసమగ్రతకు పూర్తిగా బాధ్యతవహించవలసినవారు, కాంగ్రెసు మంత్రివర్గం. దానికి నాయకత్వం వహించిన ముఖ్యమంత్రి శ్రీ పనంపల్లి గోవిందమీనన్. కమ్యూనిస్టు ప్రభుత్వంమీద యిన్ని విమర్శలుచేసే పెద్దమనుష్యులు తయారుచేసిన ప్లానులను పునఃపరిశీలిస్తే వారెలాంటి అభిప్రాయాలు వ్యక్తపరుస్తారో వినకుతూహలంగా వుంటుంది. జాగ్రత్తవలన, అవివేకమువలన లోపాలు ఏవీ జరుగకుండా చాల శ్రద్ధవహించి, కమ్యూనిస్టు ప్రభుత్వం మూడవ ప్రణాళికకు సరియైన పునాదులను వేసింది. కాని ఆ ప్రణాళికా రచన పూర్తికాకుండానే కమ్యూనిస్టు మంత్రివర్గం బర్తరఫ్ చెయ్యబడింది. కాని కేరళ రాష్ట్రంలోని నీటివనరులకు సంబంధించిన బహుళార్థ ప్రయోజన పథకం (మాష్టరు ప్లాను) పూర్తి చెయ్యగలిగినందుకుమాత్రం కమ్యూనిస్టు మంత్రివర్గం సహేతుకంగా గర్విస్తున్నది.

## నీటివనరులు - మాస్టర్ ప్లాను

కేరళఅభివృద్ధికిగాను ఆలోచించేవారికి, కొంతకాలం వినియోగించిన వారికి కేరళ రాష్ట్రంలోని నీటి వనరులు, దాని భాగ్యోదయానికి యెంతో సహాపడగలవని తెలుస్తుంది. ఈ నీటి వనరులను రాష్ట్రాభివృద్ధికి వినియోగించడంవలన, ఆహార ధాన్యాల కొరత తగ్గిపోగలదా అనే విషయం వేరు. మాష్టరు ప్లాను అమలుజరిగిననాడు ఈ కొరత పూర్తిగా పోతుందనే మా నమ్మకం. పశ్చిమ కనుమలలో పుట్టి అరేబియా సముద్రంలో కలిసిపోయే 43 నదులలోని నీరు నూటికి 80 పాళ్ళు అక్కరకు రాకుండా పోతున్నది. ఈ నదులలో కొన్నిటిని మద్రాసురాష్ట్రంలోనికి మళ్ళించి, అక్కడ భూములను సాగులోకి తీసుకొని రావాలా అన్నది వేరే ప్రశ్న. కాని కేరళ నీటి వనరులన్నిటిని, సంపూర్తిగా రాష్ట్ర ఆర్థికాభివృద్ధికి వినియోగించడం కొరకు, బ్రహ్మాండమైన బహుళప్రయోజనార్థమైన మాష్టరు ప్లానును అమలుపరిస్తే, పారిశ్రామికంగా వ్యావసాయికంగా అభివృద్ధిచెంది. ప్రతి

గ్రామానికి విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడి కేరళ సంపదవంతంగా తయారు కాగలదన్న విషయం నిస్సంశయం. లక్షలకొలది యకరాలు సాగులోకి వస్తాయి. నీటివనరుల అభివృద్ధితో గ్రామాలలో నీటి యిబ్బంది తొలగడమే కాకుండా, రహదారీ ప్రయోజనాలకు కూడా చాలా అనుకూలిస్తుంది. విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి తోడ్పడి పారిశ్రామికంగా ముందుకు పోవడానికి మార్గాన్ని సుగమం చేస్తుంది; పరిశ్రమలకు అవసరమయ్యే నూనెగాని, బొగ్గుగాని కేరళలో లభ్యంకావు. కాని విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచెయ్యడానికి అనుకూల పరిస్థితులున్నాయి. మిగతా రాష్ట్రాలలో దామాషాని ఒక "యూనిట్" విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చెయ్యడానికి రు. 1200 లు ఖర్చు అయితే, కేరళలో 800 రూపాయలతోనే ఉత్పత్తి చెయ్యవచ్చునని, సాంకేతిక నిపుణుల అంచనా.

ఏ దృక్పథంనుంచి బహుళ ప్రయోజనమైన ఈ మాస్టరు ప్లానును పరిశీలించినా, అది కేరళరాష్ట్ర వికాసానికి, ప్రజల భాగ్యోదయానికి శాస్త్రీయ పునాదులు వేసిన ఆలోచనా వైశిష్ట్యము దూరదృష్టి గోచరించును.

ఇటువంటి పథకం కేరళ శాసనసభలో ప్రవేశపెట్టబడినప్పుడు, కాంగ్రెసు మిత్రులు దానిని అవహేళన చేసి, ఎందుకూ కొరగానిదిగా చిత్రించడానికి చేసిన ప్రయత్నాలు చూస్తే, నవ్వాలో ఏడవాలో బోధపడటంలేదు. ఒక విషయంమాత్రం తథ్యం. కేరళ రాష్ట్రంలో ఎవరు అధికారంలోనికి వచ్చినా, వచ్చే 25 సంవత్సరాలలో రాష్ట్ర పారిశ్రామికాభివృద్ధికి తీసుకోవలసిన చర్యలు ఈ మాస్టరు ప్లానుపై ఆధారపడివుండటం నిస్సందేహం. కేరళరాష్ట్రం సహజసంపదలతో తులతూగుతూ ప్రజల జీవితం ఆనందప్రదంగా చెయ్యడానికి సక్రమమైన, ఆచరణయోగ్యమైన యీ ఒక్క పథకమే కేరళ మంత్రివర్గ పాలనకు కీర్తి చేకూర్చడానికి చాలును.

ఈ మాస్టరుప్లానులోని కొన్ని హాంశములను తృతీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో అమలుపర్చవచ్చు. అందుకు అప్పుడే కొన్ని చర్యలు కూడా తీసుకోబడ్డాయి.

వ్యావసాయిక, విద్యుచ్ఛక్తి రంగాలలో కమ్యూనిస్టు మంత్రివర్గం సాధించిన విజయాలు రెండో మూడో పేర్కొని ఈ ప్రకరణను ముగిస్తాను. 'పోతుంది', 'కట్టంపల్లి' పథకాలను, రెండవ పంచవర్ష ప్రణాళికలో కేరళ ప్రభుత్వం అతిప్రయాసతో చేర్పించగలిగింది. కమ్యూనిస్టులు ప్రభుత్వంలోనికి రాకముందు, ఈ పథకాలు, రెండవ ప్లానులో ఉల్లేఖించబడలేదు. ఈ రెండిటిలో ఉత్తర మలబారు జిల్లాలోని కట్టంపల్లి పథకం ప్రధానమైనది. ఆ జిల్లా మద్రాసురాష్ట్రంలో వుండగా, ఆ జిల్లాలో ఏ ప్రాజెక్టు కట్టడానికీ సాధ్యపడదని భావించబడింది. కాని కట్టంపల్లి ఒకవిధంగా పెద్ద ప్రాజెక్టులలో ఒకటి. మద్రాసు రాష్ట్రంలో వున్నప్పుడు ఒక లక్ష రూపాయలు యిందుకోసం కేటాయించబడితే, కేరళ కమ్యూనిస్టు మంత్రివర్గం 25 లక్షలు ప్రత్యేకించింది.

## ఇ త ర వ న రు లు

నదుల తరువాత, కేరళరాష్ట్ర సౌభాగ్యానికి తోడ్పడే సహజ వనరులు అటవీ సంపద, మత్స్యసమృద్ధి, ఖనిజపూరిత రేణువులుగల యిసుక. ఈ వివిధ వనరులను ఉపయోగించి, రాష్ట్రం పారిశ్రామికంగా ముందంజవేసి, నిరుద్యోగ నిర్మూలనకు తోడ్పడాలంటే, ఒక సమగ్ర పథకం అవసరం. కేరళ ప్రభుత్వం అప్పుడే కొన్ని చర్యలనుకూడా తీసుకొంది. ప్రతిరాష్ట్రం, పదిహేను సంవత్సరాలలో, పారిశ్రామిక వంతంగా తయారుకావడానికి, వ్యవసాయ, మత్స్య పరిశ్రమ వృద్ధి చెందటానికి అనువుగా, దీర్ఘకాల పథకాలు వేసుకుని, దానిలో భాగంగానే తృతీయ పంచవర్ష ప్రణాళికలో కొన్ని పథకాలు చేర్చవలసిందని ప్లానింగ్ కమిషన్ ఆదేశించింది.

వెనుకబడిన ఏ రాష్ట్రమైనా త్వరితగతిని ఆర్థికాభివృద్ధి చెంది, పారిశ్రామికంగా తయారు కావాలంటే, సమాజంలో ప్రధానమైన

మార్పులు తీసుకురావలసిన అగత్యం వుంది. దీని ప్రాముఖ్యాన్ని కమ్యూనిస్టుపార్టీ గుర్తించి కొన్ని చర్యలను తీసుకుంది. కాంగ్రెస్ పార్టీ కార్యక్రమంలో కూడా దానికి ప్రధాన స్థానమే యిచ్చారు. కాని తిరువాన్కూరు-కొచ్చిన్ రాష్ట్రంలో 8 సంవత్సరాల పరిపాలనలో దాని కనుగుణంగా కాంగ్రెసు ప్రభుత్వ వ్యవసాయ కౌలుదారీ భూసంబంధాలలో ఎటువంటి పరిణామాలు తీసుకురాలేదు. కాని కమ్యూనిస్టులు అధికారంలోనికి వచ్చిన వారం రోజులలోనే 11-4-1957 తేదీన భూమినుండి ఏవిధమైన కౌలుదార్లను, సాగుచేసుకునే యితర్లను తొలగింపకూడదని ఆర్డినెన్సు జారీచేశారు. తరువాత ఈ ఆర్డినెన్సును చట్టబద్ధంగా శాసనంక్రింద రూపొందించారు. పండిట్ నెహ్రూ, మాధవన్‌నాయర్ యిద్దరూ, కాంగ్రెస్ వ్యవసాయ సంస్కరణలకి వ్యతిరేకంకాదని చెప్తూవుంటారు. అయితే ఈ బిల్లును కమ్యూనిస్టు ప్రభుత్వం ఎసెంబ్లీలో ప్రవేశపెట్టినప్పుడు కాంగ్రెస్ పక్షం ప్రదర్శించిన వైఖరి ఏమిటి? దానిని వ్యతిరేకించడంమాట అటుంచి, ఆ భూమినుండి సాగుదార్ల తొలగింపును నిషేధించే ఈ బిల్లుకి నిరసనగా సభనుంచి వైదొలగింది. మరి ఈ నిరసనని, 'వాకౌట్'ని కాంగ్రెస్ వారు ఎలాగ సమర్థించుకుంటారో? కమ్యూనిస్టు మంత్రివర్గానికి సంబంధించినంతవరకు యితర రాష్ట్రాలలో ప్రభుత్వాలు చేసిన చట్టాలలోని లోపాలను తొలగించి, ఖచ్చితంగా సాగుదార్లకు భద్రతను కల్పించేటట్లుగా ఈ చట్టాన్ని రూపొందించింది. దీనివలన అన్ని రకాలకౌలుదార్లకు, కుడికి డప్పుకారలకి, [కేరళకు చెందిన ఒక తరహా కౌలుదార్లు - అను]న రందార్లకి కూడా మేలు కల్గింది.

కౌలుదార్ల తొలగింపును నిషేధించిన ఈ చట్టం, కార్మిక, వ్యవసాయ తగాదాల్లో కేరళ ప్రభుత్వం రూపొందించిన పోలీసు విధానం, వలన, వ్యవసాయ కూలీలు, పారిశ్రామిక కార్మికులు, బీద రైతులు మున్నగు శ్రామిక వర్గాలందరిలోను, ఆత్మవిశ్వాసము కలిగి ధైర్య స్థైర్యాలను యినుమడింపజేశాయి.కమ్యూనిస్టు ప్రభుత్వం 28నెలల

పరిపాలనా కాలంలో, కౌలుదార్లను అన్యాయపు బేదఖలు చేసిన సంఘటన యించుమించు ఒక్కటికూడా లేదు.

కేరళ వ్యవసాయ సంస్కరణల బిల్లు - కాంగ్రెస్ వైఖరి

భూమినుండి బేదఖలును నిషేధిస్తూ చట్టంచేసిన అనంతరం, వివిధ స్థాయిలలో వ్యవసాయానికి సంబంధించిన విభిన పక్షముల తోను సంప్రతింపులు జరిపి, వ్యవసాయ సంస్కరణలబిల్లు రూపొందింపబడి శాసనసభలో ఆమోదింపబడినది. ఈ బిల్లుకు సంబంధించిన అనేక విషయాలమీద వ్యాఖ్య అనవసరము. కాని ఈ బిల్లు ప్రాముఖ్యతను మరుగుపర్చేవాళ్ళ నుద్దేశించి రెండు మాటలు చెప్పడం అవసరం. వ్యవసాయ సంబంధాలలో అవసరమైన మార్పులు తీసుకరావాలని వాంఛిస్తున్నామని నెహ్రూ చాలాసార్లు చెపుతున్నారు. వారి అభీష్టముతీరి, వారికి మనస్సంతృప్తి కలగాలని ఆశిస్తున్నాను. కేరళ వ్యవసాయ బిల్లులోని సంస్కరణల బిల్లుకి సుముఖులైనవారు చాలామంది, కాంగ్రెసు పక్షంలోకలరు. కాని అంతకన్నా సుస్పష్టంగా చెప్పడం, ధైర్యం అవుతుంది. కాంగ్రెస్ ఈ బిల్లును సుతరామూ వ్యతిరేకించలేదుగాని, ఆ పక్షంలోని ఏ ఒక్క శాసనసభ్యుడూ బిల్లు త్వరితగతిని ఆలస్యం చేయకుండా ఆమోదించడానికి తోడ్పడలేదు. అంగీకరించాలని ఆసక్తికూడా కనబర్చలేదు.

కాంగ్రెస్ ప్రతిపక్షంలో వుంది కాబట్టి, వ్యవసాయ సంస్కరణల చట్టాన్ని మొత్తంమీద వ్యతిరేకించ నవసరంలేకుండా, ఏ శాసన సభ్యుడికి నచ్చని హంశాన్ని ఆ శాసనసభ్యుడు వ్యతిరేకించాడు. కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని వ్యతిరేకించడమే లక్ష్యం. కాబట్టి, వివిధ శాసన సభ్యులు ఒకరికి విరుద్ధంగా ఒకరు మాట్లాడినా, వాదనలు చెప్పినా కొట్టుకుపోయింది. ఈ బిల్లుగురించి ఒక నిర్దిష్టమైన, సహేతుకమైన విధానం అవలంబించవలసినఅవసరం లేకపోయింది.

కాని కాంగ్రెస్ ఈ బిల్లుపై ప్రత్యక్షంగా ప్రదర్శించిన వైఖరిలో కొన్ని ముఖ్య విషయాలు గమనార్హం. శ్రీ రాఘవ మీనన్ ఈ బిల్లులోని ప్రతి హంశాన్ని పూర్తిగా వ్యతిరేకించారు.

శ్రీ మీనన్, వారి కాంగ్రెస్ పార్టీ సభానాయకునే ఈ బిల్లుకి ఎసెంబ్లీలో సుముఖంగా వున్నందుకు విమర్శించారు. అయినప్పటికీ శ్రీ మీనన్ కాంగ్రెస్ ఎం. ఎల్. ఏ. గానే చలామణీ అవుతున్నారు. అంతేకాదు. "విమోచన సమరం"లో ఒక ప్రముఖ పాత్ర వహించిన సైనిక వీరుడు ఇంక మిగతావారి విషయంలో, క్రైస్తవ శాసన సభ్యులు సక్రమమైన కౌలును, శాశ్వతికౌలు రేటును ఏర్పరచడాన్ని బలపరచినా, భూ కమతాల మీద గరిష్ట పరిమితికి బద్ధ వ్యతిరేకత కనబర్చారు.

అలాగే యితర ప్రతిపక్షాలతోపాటు కాంగ్రెస్ శాసనసభ్యులు ఈ బిల్లు ఆమోదానికి ఎన్ని అవంతరాలుకలిగించాలో, ఎన్ని అభ్యంత రాలు పెట్టాలో అన్ని విధాలా యిది ఆలస్యం అయ్యేలాగు శాయ శక్తులా కృషి చేశారు. మరి వ్యవసాయ సంస్కరణలను కాంగ్రెస్ బల పరుస్తుంది అని నొక్కి వక్కాణిస్తున్న పండిత నెహ్రూ వ్యవసాయ సంస్కరణలు బలపర్చడంలో ప్రదర్శించవలసిన వైఖరికీ, వ్యతిరేకించ వలసినప్పుడు ప్రదర్శించవలసిన వైఖరికీగల తేడా సుస్పష్టం చెయ్యాలి.

భూమి విషయంలో కమ్యూనిస్టు ప్రభుత్వం చేసింది ఒక్క వ్యవసాయ సంస్కరణల బిల్లులు ఒకటేకాదు. అయితే వ్యవసాయ సంస్కరణల బిల్లు మొత్తం రాష్ట్రానికంతకూ సంబంధించింది. ఇదిగాక, (1) జన్మీకరంను మాఫీచేస్తు ఒకబిల్లు, (2) శ్రీ పండారవాకా బిల్లు, (3) శ్రీ పడోం బిల్లు, (4) పట్టా విదేవస్వామి బిల్లులను కమ్యూనిస్టు ప్రభుత్వం ప్రవేశపెట్టింది.

1932 లో తిరువాన్కూరు ప్రభుత్వం, జమీందార్ల దగ్గర కౌలుకు చేసుకొంటున్నవారికి భూమిపై హక్కు కలుగజేస్తూ ఒకచట్టం తెచ్చింది. కాని హక్కు సంక్రమించినందుకుగాను, ప్రభుత్వానికి ఈ కౌలుదార్లు కొంతపన్ను కట్టవలసి వుండెను. ఈ పన్నుని ప్రభుత్వం జామిందార్లకు చెల్లించేది. దాని ఫలితంగా కౌలుదార్లకు భూమిపై హక్కు కలిగిన అసలు శిస్తుకి తోడుగా ఈ పన్నును చెల్లించవలసి వుండుటచేత, పన్నుభారం తలకు మించినదిగా వుండేది. కమ్యూనిస్టు

ప్రభుత్వం జమీందార్లకు చెల్లించడానికై ప్రభుత్వం విధించిన అదనపు పన్నును రద్దుచేస్తూ బిల్లుచేసి, రాష్ట్రపతి అధికారానికి పంపింది - పంపి చాలాకాలం అయినా, రాష్ట్రపతి యింతవరకు ఆమోదముద్ర వేయలేదు.

అలాగే, శ్రీ పండరవాకా, శ్రీ పండోము అన్న బిల్లు తిరువనంతపురం జిల్లాలో కొన్ని ప్రాంతాలలో రైతులమీద విధింప బడుతున్న అదనపు అధిక పన్నులను రద్దుచేస్తూచేసిన చట్టములు, అదే విధంగా పట్టావి దేవస్వామి భూములువున్న రైతులవద్దనుంచి వసూళ్ళు చేయబడుతున్న అదనపు పన్నులకు వ్యతిరేకంగా కొంత కాలంనుంచి రైతులు ఆందోళన చేస్తున్నారు. ప్రభుత్వం ఆ రైతులకు వారికున్న భూమిపై హక్కు కల్పించి, దేవస్వామి బోర్డువారికి, 4 లక్షల రూపా యలు నష్టపరిహారం యీయడానికి బాధ్యత తీసుకుంటూ మరో చట్టంకూడా తేబడింది. ఈ చట్టంవలన, ఈ రైతులు యిదివరకు చెల్లిస్తున్న అదనవు పన్నులు రద్దుచేయబడ్డాయి.

## కాంధుకృషి కౌలుదారులకు సహాయము

తిరువాన్కూరు మహారాజు హక్కులో వున్న కాందుకృషి భూములను, 1948 లో తిరువాన్కూరు - కొచ్చిన్ సంస్థానములు సంలీనం అయినప్పుడు, మహారాజు ఈ భూములను ప్రభుత్వపరం చేశారు. అప్పటినుండి యీ భూములు ప్రభుత్వభూములుగానే పరిగ ణింప బడుతున్నా, రైతులు చాలా అధికమైన శిస్తును చెల్లిస్తూవుండే వారు. వారు శిస్తురేటును మిగతా ప్రాంతాలలో అమలులోవున్న శిస్తుకి తగ్గించవలసిందని ఆందోళన చేస్తూవచ్చారు. 1954లో కొంతవరకు రైతుల కోర్కెల కనుగుణంగా, ప్రభుత్వం కొన్ని ఆర్డర్లను జారీచేసింది. కాని అవి సరిగ్గా అమలు కాబడలేదు. కమ్యూనిస్టు ప్రభుత్వం కొన్ని రూల్సు చేసి, ఈ భూములు కౌలుకు సాగుచేస్తున్న రైతుల పేర్లలో నమోదు చేయబడి, వారికి పట్టాలను యిచ్చింది.

ఈ విధంగా భూస్వామ్యవిధాన అవశిష్టాలను పూర్తిగా నిర్మూలనం చేస్తూ మరే రాష్ట్రప్రభుత్వమూ యిన్ని సమగ్రమైన చర్యలను తీసుకోలేదు.

వ్యవసాయ సంస్కరణల బిల్లును వ్యతిరేకించినంత తీవ్రతతో రైతు రుణ విమోచన చట్టాన్ని కాంగ్రెసు పక్షము వ్యతిరేకించని మాట వాస్తవమే. దానికి కారణం బహుశా రాజకీయ వాతావరణం అంతగా కలుషితం కాకపోవడం అయివుండచ్చు.

అంతేకాదు, కొందరు కాంగ్రెసువారు, ఈ రైతు రుణ విమోచన చట్టం అనుకున్నంత అభ్యుదయకరంగా లేదనికూడా విమర్శించారు. వారు కమ్యూనిస్టు ప్రభుత్వం వడ్డీవ్యాపారస్థుల ఏజెంట్లుగా వ్యవహరించిందనికూడా నిందించారు.

కాని ఋణాలకు సంబంధించిన యిటువంటి ద్రవ్య విషయక చట్టాలు తెచ్చినప్పుడు, దేశ ఆర్థిక విధానం అనవసర ఒడుదుడుకులకు లోనుకాకుండా కడు జాగ్రత్తతో భారత ప్రభుత్వ విధానాలకు అనుగుణంగా రిజర్వుబ్యాంకు సిఫార్సుల ననుసరించి వ్యవహరించాలని గుర్తించిన బాధ్యతలు, ఈ చట్టాలయొక్క సాధకబాధకాలను తెలుసుకొని ఈ చట్టం ప్యాసుకావడానికి ప్రభుత్వంతో సహకరించారు.

కాని రాజ్యసభలో శ్రీ మాధవన్ నాయర్ ఈ శాసనం అట్టే ప్రయోజనకారి కాదని, యిటువంటి శాసనం అప్పుడే రాష్ట్రపతి పరిపాలన కాలంలో తిరువాన్కూరు కొచ్చిన్ రాష్ట్రంలో చేయబడిందని విమర్శించారు. కానియింగితజ్ఞానం వున్నవాళ్లెవరైనా అమలులోవున్న శాసనాన్ని తిరిగి క్రొత్త చట్టంగా తీసుకురారని, శాసనాలు చేయడం ఉబుసుపోక, సరదాగా బాధ్యతారహితంగా వ్యవహరించడం కాదని గ్రహిస్తారు. శ్రీ నాయర్ చేసిన ప్రసంగం అసంగతము, అసందర్భమూను. ఈ క్రొత్త శాసనాన్ని తీసుకురావడానికి కారణం అమలులో వున్న శాసనం లోపభూయిష్టమై వుండడమే. పాత చట్టం ప్రకారం, ఆ బాకీవున్న ఋణాన్ని ఏడు వాయిదాలలో చెల్లించాలి. క్రొత్త

శాసనం ప్రకారం పదిహేడు అర్ధసంవత్సర వాయిదాలలో చెల్లించ వచ్చు. ఇటువంటివే యింక అనేక మార్పులు తేబడ్డాయి. ఈ చట్టం ఆమోదించబడగానే, రెండువేల నూటఇరవైమూడు దరఖాస్తులు, రమారమి రెండుకోట్ల రూపాయలు ఋణభారంనుండి సహాయం పొందుటకుగాను ప్రభుత్వానికి చేరాయి. చట్టంవలన వ్యవసాయదారు లకు కలిగిన లాభం పైన చెప్పిన వివరాలే ఋజువుపరుస్తాయి.

## వ్యవసాయ కార్మికులకు కనీస వేతనాలు

కమ్యూనిస్టు ప్రభుత్వం కార్యక్రమంలో ఒక ప్రధాన విషయం వ్యవసాయ కార్మికులకు కనీసవేతనాలు నిర్ణయించడం. కనీసవేతనాల చట్టం ప్రకారం, ఏ రాష్ట్ర ప్రభుత్వానికైనా, వివిధ పరిశ్రమలలో కనీసవేతనాలు, అన్నితరహా కార్మికులకు నిర్ణయించే అధికారం వున్న ప్పటికీ, కాంగ్రెసు అధికారంలోవున్న చాలా రాష్ట్రాలలో వ్యవసాయ కార్మికులకు కనీసవేతనాలు నిర్ణయింపబడలేదు. దీనికి కారణ మేమిటి? అలాంటప్పుడు కమ్యూనిస్టులు, కాంగ్రెస్‌కన్న అధికంగా ఏమీ చెయ్య లేదనే వాదనలో అర్థం ఏమిటి? ఈ వ్యవసాయ కార్మికుల కనీస వేతనాల చట్టానికి వ్యతిరేకంగా హైకోర్టులో దావా తేవడంవల్ల మలబార్ ప్రాంతంలో యిది యింకా అమలుజరగడం లేదు.

ఒక ఉదాహరణ పరిశీలిస్తే వ్యవసాయ కార్మికులకు దానివలన ఎంతలాభం కలుగుతుందో బోధపడుతుంది. కుట్టనాడు వ్యవసాయ కార్మికుల సంఘం అంచనా ప్రకారం ఈ చట్టం అమలుకావడం పర్యవసానంగా, కుట్టనాడు వ్యవసాయ కార్మికులకు అదనంగా 6½ లక్షల 'పఱల' (శేరు, కుంచమువలె, ధాన్యం కొలమానం) ధాన్యం లభిస్తుంది.

వ్యవసాయ రంగంలో కమ్యూనిస్టు ప్రభుత్వం సాధించిన మహో ఘనవిజయం ప్రభుత్వ భూములను బీదలకు పంచడం. ఈపంచడం కార్య క్రమం కొంత తరువాయి వుండిపోయింది. మిగతా రాష్ట్రాలతో సరి పోలిస్తే కేరళరాష్ట్రంలో ప్రభుత్వ స్వాధీనంలోవున్న సాగుకు లాయకు కర్యే బంజరుభూములు తక్కువ. అంచనాల ప్రకారం 4½ నుంచి

7½ లక్షల యకరాలు వుండొచ్చు. అయితే ఈ భూములలో మూడు వంతుల భాగము చాలామంది ఆక్రమించి సాగు చేసుకుంటున్న వారికి ఈ భూములపై హక్కుగాని, పట్టాలుకాని లేకపోవడం వలన ఈ సాగుచేస్తున్న పేదరైతులు, భూఖామందుల, లంచగొండి ప్రభుత్వ అధికారుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి వారికి లొంగి, భారమైన జరిమానాలు చెల్లించుకుంటూ, నానాఅవస్థలుపడుతున్నారు. ఈ లోపాలన్నిటిని తొలగించి ప్రభుత్వ బంజరులను సాగుచేసుకుంటున్న పేద రైతులకు పట్టాల నిచ్చింది.

"కుత్తుక పట్టం" భూములను రైతులకు అద్దెకు యిచ్చే విధానంలో లంచగొండి ప్రభుత్వ అధికారులు పెడుతున్న యిబ్బందులను తొలగించి, న్యాయమైన బీద "కుత్తుక పట్టం" కౌలుదారులకి ఆభూములను దఖలుపర్చడానికి అవసరమైన చర్యలు తీసుకున్నది.

## పరిపాలనా యంత్రాంగ సంస్కరణలు

మన దేశం స్వాతంత్ర్యం సాధించి రాజ్యాంగచట్టం ఆమోదింపబడిన తరువాత, మన ప్రజాస్వామ్య సంస్థలలోను, వ్యవహారాలలోను గమనించదగ్గ మార్పులు తీసుకురాబడ్డాయి. కాని ప్రభుత్వ యంత్రాంగం నడిపే సివిల్ అధికారుల వైఖరిలో మాత్రం ఎటువంటి మార్పు కనిపించదు. వారు దైనందిన కార్యకలాపాలలోగాని, ప్రజలతోటి నిత్య సంబంధాలలోగాని కనబరచవలసిన, నమ్రత, అణుకువ, మర్యాద కనుపించవు ! వారి అధిరాహంకారము, సామాన్యులయెడ తూష్ణీ భావము ఎప్పటిలాగే పేరుకొని పోయివున్నాయి.

కమ్యూనిస్టు ప్రభుత్వం అధికారంలోనికి రాగానే ప్రభుత్వోద్యోగులకు, ప్రజాసామాన్యానికి వుండవలసిన సన్నిహిత సంబంధాలు ఏర్పడి, ఒకరిపట్ల ఒకరికి గౌరవము కలగాలంటే, ప్రభుత్వ యంత్రాంగాన్ని వికేంద్రీకరణ చేసి, ప్రజాస్వామిక సంస్కరణలు తీసుకురావడం అత్యావశరమని గుర్తించింది. అప్పుడే ప్రభుత్వ యంత్రాంగం యొక్క సామర్థ్యం పెరుగుతుంది. వివిధ రాజకీయ అభిప్రాయాలకు చెందిన

వ్యక్తులతోనూ, అనుభవయోగ్యులైన అధికార్లతోను కూడిన "పరిపాలనా నిర్వహణ సంస్కరణల కమిటీ" సిఫార్సుల నాధారంగా చేసుకొని, ప్రభుత్వం "పంచాయితీ సమితులు, జిల్లా కౌన్సిల్సు" బిల్లుని శాసనసభలో ప్రవేశపెట్టింది.

అయితే ఈ పంచాయితీ సమితులు అమలులోనికి వచ్చినా, పరిపాలనా సంస్కరణలు ప్రభుత్వం నిత్య కార్యకలాపాల్లో వేళ్ళూ తన్నుకున్నప్పుడే అవి ఫలించి వాటి లాభం ప్రజలు, అధికార్లు పొందగలరు. కాని అంతవరకు, వేచివుండక పరిపాలనా సౌలభ్యంకోసం, కొంతవరకైనా అధికారులలో ప్రజాస్వామ్య దృక్పథం ఏర్పడుటకు, ప్రభుత్వ ఉత్తర్వుల ద్వారా కొన్ని చర్యలు తీసుకోవాలి. ఈ విధానాన్ని అనుసరించే, ప్రతిపక్షాలు ఆడిపోసుకునే "కమిటీలను" పరిపాలనా యంత్రాంగంలోని అన్ని స్థాయిలలోను, ప్రభుత్వం నియమించింది. వీటిద్వారా ప్రజలకి, ప్రభుత్వ అధికారులకు, దగ్గిర సంబంధం ఏర్పడి, ఒకరి యిబ్బందులు ఒకరు అర్థంచేసుకొని, ఒకరి సహకారం ఒకరికి లభించగలదు. ఈ కమిటీలలో, అన్ని రాజకీయ పక్షాలకు ప్రాతినిధ్యం ఈయబడింది. ఈ కమిటీలన్నిటిని కమ్యూనిస్టులతో నింపివేసి, వీటిపై లక్షలకొద్దీ డబ్బు ఖర్చుచేశారని మొదట్లో అనేక విమర్శలు వినవచ్చేవి. కాని కాలక్రమేణా ఈ ఆధారం లేని నిందలన్నీ మాటుమణిగిపోయాయి. కాంగ్రెసు అధికారంలో నున్నప్పుడు తిరువనంతపురం జిల్లాలోని శాసన సభ్యులలో అధిక భాగం కమ్యూనిస్టులైనా, జిల్లా డెవలప్‌మెంటు కౌన్సిల్లోనికి ఒక్క కమ్యూనిస్టు శాసన సభ్యుడైనా తీసుకోబడలేదు. కాని కమ్యూనిస్టులు ప్రభుత్వంలో వున్నా త్రిచూరుజిల్లాలో ఒక్కగాను ఒక కాంగ్రెసు శాసన సభ్యుడే ఎన్నికయితే, ఆయనకికూడా జిల్లా డెవలప్‌మెంటు కౌన్సిల్లో స్థానం యివ్వబడింది. ఈకమిటీలు నిష్పాక్షికంగాను, న్యాయసమ్మతంగాను నిర్వహించడానికి అన్ని జాగ్రత్తలు తీసుకోబడ్డాయి.

కమ్యూనిస్టు మంత్రివర్గంమీద చెయ్యబడ్డ ఆరోపణలలో ఒకటి కమ్యూనిస్టు కార్యకర్తలు, కమిటీలు ప్రభుత్వ అధికారులమీద విపరీత

మైన వత్తిడి తీసుకువచ్చారని, దానివలన, ప్రభుత్వ అధికార్లు స్వాతంత్రంగా నిష్పాక్షికంగా వ్యవహరించలేకపోయారని. కాని ఈ ఆరోపణల వెనుకనున్న నిజానిజాలు ఏమిటి? ప్రభుత్వ ఉద్యోగస్తులేగాని, వారి మనసులో వున్న మాట చెబుతే, కమ్యూనిస్టు ప్రభుత్వంక్రింద వారు స్వాతంత్రించి వ్యవహరించడానికి ఎంత స్వేచ్ఛవున్నదీ, వాళ్ళు నిర్భయంగానూ, నిర్మొగమాటంగానూ, విషయాలు చర్చించుకొని నిర్ణయాలు చేసుకోడానికి వలనుపడినదీ తెలుస్తుంది. అంతేకాదు చిన్న ఉద్యోగస్తులు వాళ్ళ కష్టాలు, యిబ్బందులు చెప్పుకోడానికి ఎంత అవకాశం కమ్యూనిస్టు ప్రభుత్వం యిచ్చిందో, ప్రజాస్వామ్య ఆదర్శం ప్రకారం నాన్‌గెజెటెడ్ ఉద్యోగస్తుల సంఘాన్ని అధికారరీత్యా గుర్తించిందో స్పష్టమాతుంది. అయితే కొందరు యన్. జి. వో. లు, ఉపాధ్యాయులు ప్రభుత్వం యిచ్చిన ఈ స్వేచ్ఛనీ, అవకాశాన్నీ దుర్వినియోగం చెయ్యడం విచారకరం.

## ప్రభుత్వోద్యోగుల జీతాల పెంపుదల

సాంఘికన్యాయం కలుగజేయడానికి సామ్యవాద తరహాసమాజ నిర్మాణాని కనుకూలంగా అన్ని రంగాల్లోను, ధనికుల అధిక రాబడిని తగ్గించి, తక్కువ రాబడిగలవారి ఆదాయాల్ని పెంచడానికి కమ్యూనిస్టు ప్రభుత్వం శాయశక్తులా పనిచేసింది. ప్రభుత్వ సిబ్బంది పరిస్థితులను గమనించుదాం. ప్రైవేటు స్కూళ్ళ ఉపాధ్యాయుల్ని మినహాయిస్తే లక్షకు పైబడి ఉద్యోగులు ప్రభుత్వంక్రింద పనిచేస్తున్నారు. ఇందులో నూటికి డెబ్భైఅయిదుమంది, నాన్‌గెజెటెడ్ ఉద్యోగస్థులు. ప్రైవేటు స్కూలు ఉపాధ్యాయుల్నికూడా లెక్కలోకి తీసుకుంటే వారు మరో డెబ్భైఅయిదువేలమంది వుంటారు. వారందరిలోను నెలసరి 40 రూ॥ మూలవేతనము తెచ్చుకుంటున్నవారు 30,000 మందికిపైగా వుంటారు. వారి జీతభత్యాల క్రింద సంవత్సరానికి 15 కోట్ల రూపాయలు, అంటే నెల ఒక్కంటికి ఒక కోటి 25 లక్షల రూపాయలు ప్రభుత్వానికి ఖర్చు అవుతుంది. కమ్యూనిస్టు ప్రభుత్వం

చేసిన జీతాల హెచ్చింపువల్ల యీ ఉద్యోగస్తులకి మరో కోటి 50 లక్షల రూపాయలు అదనంగా లభిస్తాయి. ఈ జీతాల హెచ్చింపు వల్ల ముఖ్యంగా ఆఫీసు జమానులు, ఆస్పత్రి పనివారలు, ఎటెండర్లు, పోలీసు జమానులు మున్నగు చిన్న వుద్యోగస్తులకు బాగా లాభం కలిగింది. రూ. 20–30; రూ. 30–50; రూ. 35-80 లోయర్ ట్రైనింగ్ ఉపాధ్యాయులకు రూ. 20–30; హైయ్యర్ ట్రైనింగు ఉపాధ్యాయులకు 30–50; సెకండరీ ట్రైనింగు ఉపాధ్యాయులకు రూ. 30–85 జీతాలు వుండేవి. ఇప్పుడు వీరందరికీ సమానంగా రూ. 40–120 కు హెచ్చింపబడింది. పట్టభద్రులైన ఉపాధ్యాయులకి రూ. 50–150 నుండి రూ. 80–165 కి పెంచబడింది. ఒక్క విద్యా శాఖలో జీతాల హెచ్చింపు వల్లనే రమారమి నూట ఎనభై లక్షల రూపాయలు అదనంగా ప్రభుత్వానికి ఖర్చు పెరిగింది. ఈ విధంగా చిన్న వుద్యోగస్తుల జీతాలను కమ్యూనిస్టు ప్రభుత్వం హెచ్చుచేసి మూడుకోట్ల రూపాయలు అదనంగా ఖర్చు పెడుతున్నది. దాదాపు ప్రతి వుద్యోగికి నూటికి ఇరవై వంతులు జీతం పెరిగింది.

## లేబరు కంట్రాక్టు సొసైటీలు

ప్లానింగు కమిషన్ లేబరు కంట్రాక్టు సొసైటీలను ప్రోత్సహించాలని సిఫారసు చేసింది. ఇటువంటి సొసైటీలు కొద్దిగా కొన్ని రాష్ట్రాలలో వున్నాయి. కాని ప్రప్రథమంగా ఈ లేబరు కాంట్రాక్టు సొసైటీలను శాస్త్రీయంగాను, నిర్దిష్టమైన క్రమబద్ధంగాను ఏర్పాటు చెయ్యడానికి కమ్యూనిస్టుప్రభుత్వం పూనుకొంది. కోట్లకొద్దీ ధనం వ్యయపరిచే, రోడ్లు మరమ్మత్తు చెయ్యడం మున్నగు నిర్మాణ కార్యక్రమాలకి, ప్రత్యేక నిపుణతగాని, తర్ఫీదుకాని అవసరంలేదు. ఈ నిర్మాణ కార్యక్రమాలవలన ప్రయివేటు కంట్రాక్టర్లు లక్షలకొలది డబ్బు ఆర్జిస్తున్నారు. ఇంత ప్రజాధనం, ప్రైవేటు కంట్రాక్టర్లకు లాభాలు పోవడం అన్యాయమని లోకజ్ఞానమున్నవారెవరేనా గ్రహిస్తారు. అందుచేత కార్మికులను సహకార సంస్థలక్రింద సమీకరించి, ఆ సహకారసంస్థలకి

యిటువంటి నిర్మాణ కార్యక్రమాలు వప్పగించితే, శ్రామికులు లాభం పొందుతారు. ఈ సొసైటీలను నిర్మించేటప్పుడు, లంచగొండితనము, బంధుప్రీతి మొదలగు అవినీతి సాగకుండా ప్రత్యేక శ్రద్ధ వహించ బడింది. ఒక్కొక్క బ్లాక్ కి ఇటువంటి సహకార సంస్థ ఏర్పాటు చెయ్యబడింది.

ఈ లేబరు సహకార సంస్థలను నిర్మించే బాధ్యత బ్లాక్ డెవలప్ మెంటు ఆఫీసరుకు వప్పగించబడింది. బ్లాక్ డెవలెప్ మెంటు ఆఫీసరు ఆ బ్లాక్ లో పనిచేసే జూనియర్ ఇంజనీరు, ఈ సొసైటీల అధికార నిర్వహణ సంఘంలో సభ్యులుగా వుంటారు. ఈ విధంగా కేరళరాష్ట్రం మొత్తంమీద 42 సొసైటీలు నిర్మించ బడ్డాయి. 1958-59 సంవత్సరంలో 25 లక్షల రూపాయల పనులు వీటి నిర్వహణ కియ్య బడ్డాయి. కాంగ్రెస్ వారి స్మృతిపథంలోను, ఊహాగానంలోను తప్ప ఎంత రంధ్రాన్వేషణ చేసినా ఈ లేబరు సొసైటీలలో, అవినీతిగాని, పక్షపాతం గాని మానవ మాత్రులకు కనుపించవు. ఏదోవిధంగా నిందారోపణ చెయ్యాలని, కొంత మంది కాంగ్రెస్ వాదులు, ఈ లేబరు సొసైటీ నిబంధనావళి మున్నగునవి, ఏ ఏ ప్రాంతాలలో, కమ్యూనిస్టుల ఆధ్వర్యాన వున్న సంస్థలని నమోదు చెయ్యాలో, నిర్ణయం తీసుకున్న తరువాతనే, ప్రకటించబడ్డాయని కొంత విమర్శ చేశారు. కాని సొసైటీలకి సంబంధించిన విషయాలు పరిశీలిస్తే, ఈ ఆరోపణలు పచ్చి అబద్ధాలని తేలుతుంది. లేబరు కంట్రాక్టు సొసైటీలకు సంబంధించిన నిబంధనావళులు యిత్యాది సమాచారం, డిశెంబరు 26 1957 కే ప్రకటింప బడ్డాయి. తగినంతగడువు, వ్యవధి యిచ్చిన తరువాతనే, మొదటి 25 సొసైటీలు మార్చి 28, 1958 లో నమోదు చేయబడ్డాయి. మిగిలిన 17 సొసైటీలు తరువాత రిజిష్టరు చేయబడ్డాయి. ఏ ఏ సొసైటీ రిజిస్ట్రేషన్ కావాలని కోరాయో, ఆ సొసైటీలన్నీ రిజిష్టరు చేయబడ్డాయి.

కాంగ్రెసు నాయకులు యీ లేబరు సొసైటీల మీద ఇన్ని అభాండాలు వేయడానికి అసలు కారణం ఈ సంస్థలలో లంచగొండి

తనం, అవినీతి వుండటం కాదు. ఈ సొసైటీల మూలంగా, ప్రైవేటు కంట్రాక్టరుల లాభాలు పడిపోవడం. వారికి యిటువంటి ప్రభుత్వ నిర్మాణ కార్యకలాపాలలో కొంతవరకైనా స్థానం లేకుండా చేసి వారి దోపిడిని సాగనివ్వకపోవడం. ఎక్కడైతే ఈ లేబరు కాంట్రాక్టు సొసైటీలు పనులు తీసుకొని నిర్వహించాయో అక్కడల్లా, ప్రైవేటు కాంట్రాక్టర్ల క్రింద పనిచేసే కార్మికులకన్నా కార్మికులు ఎక్కువ వేతనము దొరకడమే కాకుండా యింకా యితరత్రా అనేక లాభాలు పొంది పరిస్థితులు ఎన్నోరెట్లు మెరుగు అని భావించారు. అంతేకాకుండా పనులుకూడా చాలా పొదుపుగాను, సమర్ధవంతంగాను, చురుకుగాను పూర్తి అయ్యాయి. ఎడ్వాన్సుల క్రింద ఒక దమ్మిడీకూడా ఈ సొసైటీలకు ప్రభుత్వం యివ్వలేదు. రాష్ట్ర సహకార బ్యాంకు పని అంచనా ప్రకారం నూటికి ఇరవై అయిదు రూపాయలు ఈ సొసైటీలకు అప్పుగా యిచ్చేది. పనులు పూర్తి అయి బిల్లులు చెల్లించినప్పుడు స్టేటుబ్యాంకు ఆ అప్పులను వసూలు చేసేది.

## కల్లుగీత కార్మిక సహకార సంఘాలు

కల్లుగీత కార్మిక సహకార సంఘాలుకూడా లేబరు కాంట్రాక్టు సొసైటీల పద్ధతిమీదే నిర్మింపబడ్డాయి. అయితే అవి ఏర్పడిన పరిస్థితి మాత్రం వేరు. "కమ్యూనిస్టులు ప్రభుత్వాన్ని నాశనం చేయాలనే వుద్దేశంతో కమ్యూనిస్టులు అధికారంలోనికి వచ్చిన మొదటిరోజుల్లోనే కొట్టాయంజిల్లాలో ఒకవిధమైన మద్యపాన నిషేధం ఉద్యమం లేవదీయ బడింది. ఈ ఉద్యమ లక్షణం ఏమిటంటే తాడిచెట్ల మొదళ్లను నిలువుగా నరికి కల్లు తీయటానికి వీలుకాకుండా చెయ్యడం, కల్లు దుకాణదారులనుభయపెట్టడంమున్నగుదౌర్జన్యయుతమైన కార్యక్రమం. దీని ఫలితంగా కొట్టాయం జిల్లాలో 1958-'59 సంవత్సరంలో కల్లు గుత్తకుపాడే ఖాతాదార్లు కరువయ్యారు. ఈ సవాలును ఎదుర్కో డానికి, కల్లుగీత కార్మిక సహకార సంఘాలు స్థాపించవలసివచ్చింది. 1958-'59 సంవత్సరంలో, త్రిచూర్ తాలూకా, ఎలెప్పీ, షెర్టల్లీ

కొండ ప్రదేశాల్లో మాత్రం కల్లుగీయడానికి, ఈ కల్లుగీత కార్మిక సహాకార సంఘాలకి వేలం లేకుండా గుత్తకియ్య బడ్డాయి. విధివైచిత్ర్య మేమిటోగాని, కాంగ్రెస్ పార్టీ అధికారంలోవున్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు అమలు పెట్టిన ఈ పథకం కేరళ ప్రభుత్వ దృష్టికి రాగా, దాని వివరాలు ఆ రాష్ట్ర ప్రభుత్వంనుంచి సేకరించి, కేరళ కమ్యూనిస్టు మంత్రివర్గం, ఈ కల్లుగీత కార్మిక సహాకార సంఘాలను రూపొందించింది. కల్లుగీత అధికారం వేలం వెయ్యకుండా, ఈ సహాకార సంస్థలకి అప్పగించే ముందు, ఈ సంస్థల సభ్యులలో అధికం గీత పనివారై వుండాలని, ఆయా ప్రదేశాలలో పనిచేసి, అసిస్టెంటు ఎక్సైజు కమిషనర్లు ఆ సంస్థల అధికార నిర్వహణ సంఘాలలో సభ్యులుగా వుండాలని షరతులను కేరళ ప్రభుత్వం విధించింది. ఈ గుత్త అధికారం యిచ్చినందుకు, ఆ ప్రదేశములోని, గీత కార్మికుల సహాకార సంఘం, అంతకుముందు అయిదు సంవత్సరాలుగా వేలంపాట పాడిన మొత్తాలు తీసుకొని వాని దామాషా రేట్లప్రకారం ప్రభుత్వానికి కౌలు చెల్లించాలి.

1959 – '60 లో అయిదు సంవత్సరాలనుండి కౌలుకు తీసుకున్నట్టి సంవత్సరపు ముందటి మూడు సంవత్సరాల వేలంపాటలు దామాషాను తీసుకోవాలని నిర్ణయం జరిగింది.

ఈ విధంగా నిర్ణయించడంవలన ప్రభుత్వం నష్టపోయిందని, కేరళ ప్రభుత్వాన్ని విమర్శించారు. కేరళ గవర్నరు, రాష్ట్రపతికి సమర్పించిన రిపోర్టులో ఉల్లేఖించిన 4 లక్షల రూపాయలు నష్టము దీనివిషయమే అయివుంటుంది. కాని ఈ గీతపనివారల సహాకార సంఘాలకు, కల్లుగీత గుత్తకుయివ్వడంవల్ల నష్టం వచ్చిందని భావించడం, పట్టి ఆధారరహితమైన అపవాదు. కల్లుగీత కార్మికుల సహాకార సంఘాలకు, గుత్తయియ్యకుండా, వేలం పాడివుంటే యింకా అధనంగా బాగా ప్రభుత్వానికి ఆదాయం వచ్చివుండేదని భావించి, అందుచేత నష్టం చేకూరిందని ఊహించడం అర్థంలేని వాదన. వేలంపాటవలన అధిక ఆదాయంబదులు, ఆ క్రిందటి సంవత్సరంకన్నా చాలా తక్కువ

ఆదాయం రావడానికూడా అవకాశం లేకపోలేదు. వేలంవలన హెచ్చు లాభం, నష్టం కూడా ప్రభుత్వం పొందవచ్చు. ప్రభుత్వ కల్లు గీత గీసే గుత్తఅధికారం, ఈ సహకారసంస్థలకి యివ్వడంతప్ప తవి తర సహాయం ఎలాంటిది చేయలేదు. ఒక్క దమ్మిడీకూడా వాటి కియ్య లేదు. ఈ సంఘాలకి, సహకార బ్యాంకులు అప్పులు యిచ్చాయి. మొత్తం అన్ని సంఘాలకి కలిపి, 65 వేల రూపాయల ధరావత్తు మాత్రం ప్రభుత్వంవద్ద వుంది. మొదటి సంవత్సరం ఒక్క పైసకూడా బాకీ లేకుండా, పూర్తిగా ఈ సంఘాలు, కౌలును చెల్లించాయి. అలాగే, బ్యాంకులో తీసుకున్న అప్పులుకూడా పూర్తిగా చెల్లించేసి నట్లు తెలుస్తున్నది. ఇన్ని ఏళ్ళనుండి గుత్తకు తీసుకున్న ప్రైవేటు కంట్రాక్టర్లు మాత్రం ప్రభుత్వానికి బాకీపడకుండా పూర్తిగా శిస్తు చెల్లించిన సంవత్సరం అంటూ లేదు. ఈఅనుభవం ఆధారంగా చేసుకుని 1959 – '60 సంవత్సరములో, వివిధ తాలూకాల్లో 536 దుకాణాలు ఈ కల్లుగీత కార్మికుల సహకారసంస్థలకి ఒప్పగించబడ్డాయి.

కేరళ రాష్ట్ర గవర్నరు రాష్ట్రపతికి అందజేసిన రిపోర్టులో ఈ కల్లుగీత కార్మికుల సహకార సంఘాల వలన, ప్రభుత్వానికి సంవత్స రానికి రమారమి ఒక కోటి రూపాయలు నష్టం వచ్చిందని ఆరోపణ చేయడం చాలా దురదృష్టదాయకం. ఇటువంటి బాధ్యతారహితమైన ప్రకటనలు గవర్నరు చేయడం ఎంతైనా గర్హనీయము. ఈ కల్లుగీత గుత్తకీయడం వలన ప్రభుత్వానికి ఏటా ఆదాయం ఒక కోటీ డెబ్బై అయిదు లక్షల రూపాయలు. ఇంచుమించుగా యిదంతా కేరళ ప్రభుత్వం నష్టపోయిందని భావ్యమా ? 1958 – '59 సంవత్సరముతో సరిపోల్చి చూస్తే యీ పద్దు కింద యీ ఏడాది ఆరులక్షల ఏభై వేల దాకా ఆదాయం పెరిగింది. గడచిన సంవత్సరాల ఆదాయంతో సరిపోలిస్తే 1958 – '59 కల్లుగీత గుత్తకిచ్చిన దుకాణాలు చెల్లించిన కౌలు మొత్తం ఆదాయంలో ఒక లక్ష ఏభై వేలు మాత్రమే తగ్గింది. ఏ విధంగా పరిశీలించినా మరి కేరళ గవర్నరుగారు యీ కోటి రూపా

యులు ప్రభుత్వానికి నష్టం వచ్చిందన్న సమాచారం ఎలా సంపాదించారో దురూహ్యంగా వుంది.

కార్మికుల మేలు దృష్ట్యా ఏదృక్పథంనుంచి చూసినా, ఈ సహకార సంస్థలవల్ల వారికి చాలా లాభాలు కలిగాయి. ఏ ప్రయాసా లేకుండా, శాసనం ప్రకారం నిర్ణీతమైన కనీస వేతనం కార్మికులకి లభించింది. సంవత్సరానికి ఒక నెల వేతనం 'బోనస్' అదనంగా వచ్చింది. జీతంతో సహా సంవత్సరానికి 7 సెలవులు దొరికాయి. నిర్ణయం చేసిన గంటలకన్నా అధికకాలం పనిచేస్తే, అధిక వేతనంకూడా లభ్యమవుతున్నది. ఇలాగే సంవత్సారాల తరబడి ఆందోళన చేస్తున్న ఎన్నో సౌకర్యాలు సమకూడాయి. వీరితోపాటు ప్రైవేటు కంట్రాక్టర్లకి సులువుగా సంక్రమిస్తూ వచ్చిన అధికలాభాలుకూడా పోయాయి. పాపం! మరి కాంగ్రెస్ యిలాంటి చర్యలపట్ల అగ్గి గుగ్గిలం అయిపోయిందంటే ఆశ్చర్యపడనక్కరలేదు.

మనదేశంలో మరో రెండురంగాలలో సహకార ఉద్యమం వ్యాపిస్తే శ్రేయోదాయకం. మొదటిది అడవులు నరికే కంట్రాక్టు విషయంలోను, రెండవది చేపలుపట్టే హక్కు విషయంలోను ఈ సహకార పద్ధతి ప్రవేశపెట్టబడాలి. కమ్యూనిస్టు ప్రభుత్వం ఈ రెండు రంగాలలో, సహకార సంస్థలు వర్ధిల్లడానికి కావలసిన పునాదులను వేసింది.

## కొబ్బరి పీచు సహకార సంస్థలు

చేనేత, కొబ్బరి పీచు సహకార సంఘాల ఆవశ్యకత యిదివరకే గుర్తించబడినది. అందుచేత వాటి అవసరం, ప్రయోజనం యిక్కడ సమర్థించడం అవసరం. కాని ఒక్క విషయం మాత్రం దృష్టికి తీసుకురావలి. కాంగ్రెస్ పరిపాలనకి, కమ్యూనిస్టుల బాధ్యతాయుత ప్రవర్తనకి, చక్కని నిదర్శనం ఈ కొబ్బరి పీచు సహకార సంస్థలు. అవి కాంగ్రెసువారి చేతుల్లో దుర్గంధపూరితమై అవినీతికి, లంచగొండితనానికి ఆలవాల మయ్యాయి. కాని, కమ్యూనిస్టులు అధికారంలోకి వచ్చిన

తరువాత వానిని సరిదిద్ది చక్కబరచి ఈ సంస్థలలో పనిచేసే కార్మికులకు లాభసాటిగా పునఃనిర్మింపబడ్డాయి. కాంగ్రెసు హయాములో చాలా కొబ్బరి పీచు సహకార సంస్థలు స్థాపింపబడి, లక్షలకొలది ధనం వాటిపై వృథాగా ఖర్చుపెట్టబడింది. 1957 సరికి 187 సహకార సంస్థలు స్థాపింపబడి, 73 లక్షల 50 వేల రూపాయలు ఋణాలక్రింద, గ్రాంటులక్రింద వాటికి అందచేయబడ్డాయి. కాని ఈ సహకార సంస్థలలో అధికభాగము కార్మికుల అజమాయిషీలో లేకుండా, వర్తకుల హస్తాల్లోను, దళారీల చేతుల్లోనువుండి అవినీతికి లంచగొండితనానికి నిలయమైపోయాయి. ఈ కొబ్బరిపీచు సహకార సంఘాల వ్యవహారాలను దర్యాప్తు చేయమని నియమింపబడిన శ్రీ తెయ్యుణ్ణిమీనన్ నివేదికలో ఈ విషయాలు బయటపడ్డాయి. ఇంచుమించు ఇదేఅభిప్రాయం భారతప్రభుత్వంచేనియమింపబడిన ఉన్నత అధికార కమిటీ వెలిబుచ్చింది. అందుచేత మద్రాసుప్రభుత్వం రాష్ట్రపునఃనిర్మాణతరువాత, ఆ రాష్ట్రంలో చేరిన కన్యాకుమారి జిల్లాలోని అన్ని కొబ్బరిపీచు సహకార సంస్థలను రద్దుపరచిందంటే ఆశ్చర్యపడనవసరంలేదు. కేరళ ప్రభుత్వం ఈ సహకారసంస్థలను బాగుపరచడానికి ప్రయత్నంచేసింది. కమ్యూనిస్టులు అధికారంలోనికి వచ్చిన తరువాత ఈ సహకారసంస్థలలోకి కార్మికులు అధిక సంఖ్యాకులుగా చేరటానికి అనువుగా, వాటాధనమును, చేనేత సంఘాలకు యిచ్చినట్లుగానే ప్రభుత్వము అప్పుగా యిచ్చింది. ప్రతి కొబ్బరి పీచు కార్మికుడు రెండు వాయిదాలలో ఒక రూపాయి సభ్యత్వ రుసుము చెల్లించి సభ్యుడుగా చేరాలి. వాటాధనంలోని మిగిలిన తొమ్మిది రూపాయలు ప్రభుత్వం అప్పుగా పెట్టుబడి పెడుతుంది. ఈ అప్పును 18 నెలలలో నెల 1 కి అర్ధరూపాయి చొప్పున తన వేతనంలోంచి చెల్లించి అప్పుతీర్చాలి. కార్మికులకు అమ్మిన వాటాల మొత్తమునకు పదింతలు ప్రభుత్వము కొబ్బరిపీచు సహకార సంఘానికి వాటా రుసుం అప్పు యిస్తుంది. ప్రభుత్వంయొక్క యీ పథకం పర్యవసానంగా వేలమంది బీదకార్మికులు ఈ సహకార సంస్థలలోచేరి వాటిని తమ స్వాధీ

నంలోనికి తీసుకున్నారు. ఇంతకు పూర్వం అయిదు సంవత్సరముల లెక్కలుతీస్తే, కార్మికులు యితరులు కలిసి ఈ కొబ్బరిపీచు సహకార సంఘాలన్నిటిలోను కూడగట్టుకుని 50 వేలకన్నా మించ లేదు. కాని కమ్యూనిస్టు ప్రభుత్వం అధికారంలోనికి వచ్చిన తరువాత ఒక్క ఏడాది లోనే 40,000 కార్మికులు సభ్యులుగా యీ సంస్థలలో చేరారు. కమ్యూనిస్టు ప్రభుత్వమే కొనసాగివున్నట్లయితే, కొబ్బరిపీచు పరిశ్రమ పూర్తిగా కార్మికుల అజమాయిషీ క్రిందకు వచ్చేది.

ఇంకా వివిధమైన యితర రంగాలలోకూడా సహకార ఉద్యమం విస్తరింపచెయ్యాలని కమ్యూనిస్టు ప్రభుత్వం వాంఛించింది. చిన్న పరిశ్రమలను సాధ్యమైనంతవరకు సహకార సంస్థల ఆధ్వర్యాన నడపాలని కమ్యూనిస్టు ప్రభుత్వ విధానం. అయితే దాన్ని అమలుపెట్టలేక పోవడానికి కారణం ధనాభావమే. అయినప్పటికీ, పెంకులు, బీడీ, ఇటుకలు, అగ్గిపెట్టెలు, పడవల నిర్మాణం, శస్త్రచికిత్స పరికరములు, చేనేత మగ్గములు, తోళ్ళు మున్నగు పరిశ్రమలలో ప్రయోగాత్మకంగా, పరిమితంగా సహకార విధానం ప్రవేశపెట్టబడింది.

కాంగ్రెసు నాయకులకు ప్లానింగ్ కమిషన్‌కు సామ్యవాదంలో నమ్మకంవుండి సోషలిజం గురించి వట్టిగొప్పలు చెప్పడంకన్నా సామ్యవాదాన్ని సాధించాలని ఆసక్తి, ఉత్సాహంవుంటే, కేరళలో జరిగిన 28 నెలలకమ్యూనిస్టు ప్రభుత్వ పరిపాలననుండి ఎన్నో చక్కని గుణపాఠాలు నేర్చుకోవచ్చు.

## పరిశ్రమలు

పరిశ్రమల విషయంలో కమ్యూనిస్టు ప్రభుత్వ విధానం వైఫల్యం చెందినదని, కమ్యూనిస్టుప్రభుత్వాన్ని బలపరచిన వ్యక్తులలో కూడా కొందరికి అనుమానాలున్నాయి. అయితే ఈ అనుమానాలకీ అపోహలకి కారణం, పరిశ్రమలకు సంబంధించిన క్లిష్టమైన వివిధ పరిస్థితులు జనసామాన్యానికి తెలియకపోవడమే. క్రొత్త పరిశ్రమలు స్థాపించడానికి ముఖ్యంగా పెట్టుబడి, సాంకేతిక పరిజ్ఞానం అవసరం. ఈ

రెండు విషయాలలోను మనకు చాలా పరిమితులు వున్నాయి. కేరళ రాష్ట్ర పరిశ్రమలశాఖలో దూరదృష్టి, అనుభవం గల సాంకేతిక నిపుణులు లేనే లేరని చెప్పాలి. అట్లాగే ధైర్యం, ఉత్సాహం కలిగిన పెట్టుబడిదారులు క్రొత్తపరిశ్రమలు పెట్టి, ముందంజ వేయాలని కుతూహలం కలిగిన పారిశ్రామిక వేత్తలు కూడా కేరళరాష్ట్రంలో లేరు. వాటిని అన్నిటిని మించి దుష్కరమైనది కేంద్రప్రభుత్వంనుంచి క్రొత్త పరిశ్రమలు స్థాపించడానికి అనుమతి, దానికి అవసరమయ్యే విదేశీమారకం పొందడం. ఇన్ని అవాంతరాలు వున్నా గత 28 మాసాలలోను పరిశ్రమల విషయంలో ప్రభుత్వం సాధించినది కొంతైనా లేకపోలేదు.

ప్రభుత్వ ఆధిపత్యం క్రిందవున్న పరిశ్రమలను లాభసాటిగాను సమర్ధవంతంగాను నిర్వహించటానికి కమ్యూనిస్టు మంత్రివర్గం కృషి చేసింది. కేరళరాష్ట్రంలో, కమ్యూనిస్టులు అధికారంలోకి రాకపూర్వం ప్రభుత్వ రంగంలోని పరిశ్రమలన్నీ అధ్వాన్నస్థితిలోవున్నాయని తెలిసినవారందరూ ఒప్పుకుంటారు. కాని కమ్యూనిస్టు ప్రభుత్వం ఈ పరిశ్రమల అజమాయిషీని పునఃనిర్మాణంచేసి, యిదివరకు నష్టంవస్తున్న పరిశ్రమలనులాభసాటిగా చేసింది. ఉదాహరణకు, రబ్బరు ఫ్యాక్టరీ, షార్కు చేపనూనె పరిశ్రమ, పింగాణీ పరిశ్రమ మున్నగునవి.

18 లక్షల రూపాయల పెట్టుబడితో నిర్మించి మూలబడిన డాల్డా ఫ్యాక్టరీని పునరుద్ధరించుటలో కమ్యూనిస్టు ప్రభుత్వం సాహసం చూపించిందనే చెప్పాలి. టిటానియం, ఎరువులు, రసాయనములు (యఫ్. ఏ. సి. టి) మున్నగు పరిశ్రమలలో ప్రభుత్వం హెచ్చు మొత్తాలు పెట్టుబడి పెట్టినా, వాటిని యిష్టంవచ్చినట్లు స్వంత జాగీర్లలాగా దోపిడి చేసుకోడానికి అవకాశం కల్పిస్తూ ప్రైవేటు పరిశ్రమ వేత్తల అజమాయిషీక్రింద వుంచబడ్డాయి. ఈ పరిశ్రమలను, కొంత వరకైనా అదుపులోనికి తెచ్చి ప్రభుత్వ పెత్తనం పెరగడానికి కొన్ని అవసర చర్యలను కమ్యూనిస్టు ప్రభుత్వం తీసుకొంది. దీని ప్రయోజనాలు భావిలో కనిపిస్తాయి.

ఇదేవిధంగా నష్టాలు పెరిగిపోతూ నాశనానికి సిద్ధంగా వుండి, మూసివేయబడు సమయంలో వున్న పరిశ్రమలను ప్రభుత్వం స్వాధీన పరచుకొని, వేలకొలది కార్మికులు నిరుద్యోగానికి గురికాకుండా ఆదుకొని, కమ్యూనిస్టు ప్రభుత్వం చెప్పుకోదగ్గ మేలుచేసింది. 'కొచ్చిన్ మహాలక్ష్మి మిల్లు', 'తిరువాన్కూరు నూలు మిల్లు', 'కేరళ నీటి రహదారి కార్పొరేషన్' యిలా స్వాధీనపరచుకున్న సంస్థలకి కొన్ని ఉదాహరణలు. ఈ మూడు పరిశ్రమలలోనే 3,500 మంది కార్మికులు పనిచేస్తున్నారు. 'వంచినాడు' అగ్గిపెట్టెల పరిశ్రమను తీసుకోవాలని తలపెట్టింది. అన్నిటికన్నా ముఖ్యమైనది ఆర్థిక ఒడుదుడుకులకు లోనై, వాటి తాకిడికి తట్టుకోలేక క్లిష్టపరిస్థితిలో పడిన జీడిపప్పు పరిశ్రమను, ప్రభుత్వ పెట్టుబడితో కార్పొరేషన్‌ను ఏర్పరిచి, ఆర్థిక చిక్కులనుండి తప్పించింది. నాలుగు జీడిపప్పు కర్మాగారాలను సహకార సంస్థలుగా స్థాపించి, కార్మికుల ఆధిపత్యం క్రింద నడపడానికి అనువైన పరిస్థితులను కలుగజేసింది. చిన్నతరహా పరిశ్రమలకు, పెద్దతరహా పరిశ్రమలకు తగినవిధంగా ధనసహాయం చేయడానికిగాను కేరళ కమ్యూనిస్టు ప్రభుత్వం, స్వతహాగా అప్పుయిచ్చి ఇండస్ట్రియల్ ఫైనాన్షియల్ కార్పొరేషన్ ద్వారాను, యిదివరకు ఎప్పుడూ లేనంత సులువుగాను, విరివిగాను అప్పులు దొరకడానికి తోడ్పడింది. నిష్పాక్షికులైన పరిశీలకులు పరిశ్రమల రంగంలోకూడా కమ్యూనిస్టు ప్రభుత్వం ఎనిమిది సంవత్సరాలలో, కాంగ్రెసు ప్రభుత్వంకన్నా, అధికంగా సఫలీకృత మైందని ఒప్పుకోక తప్పలేదు.

పారిశ్రామిక కార్మికుల విషయంలో, కేరళ ప్రసూతి సహాయ చట్టం, పారిశ్రామిక సంబంధాలచట్టం ద్వారా కార్మికులకు కొన్ని చెప్పుకోదగ్గ విజయాలను కమ్యూనిస్టు ప్రభుత్వం చేకూర్చింది.

ఈ శాఖలో సాధించిన విజయాలు యింతేకాదు. కార్మికశాఖ, కార్మికమంత్రి స్వయంగా చొరవచేసి జోక్యం కలుగచేసుకొన్న ఫలితంగా కొన్నివందల కార్మిక తగాదాలలో, ఉభయులకు అంగీకార యోగ్యమైన ఒప్పందంకుదిర్చి కార్మికులకు ఎన్నో విజయాలను, కమ్యూ

నిస్టు ప్రభుత్వం సాధించింది. వీటి ఫలితంగా ఇదివరకుకంటే యిప్పుడు కార్మికులు ఎక్కువ 'బోనస్'ను అనుభవిస్తున్నారు. చాలా పరిశ్రమలలో వేతనాలు పెరిగాయి. 18 పరిశ్రమలలో, కనీస వేతనాలు నిర్ణయించ బడ్డాయి.

## పోలీసు విధానం

ఆఖరి విషయం అయినా చాలా ప్రాముఖ్యమైనది, కేరళ కమ్యూనిస్టు ప్రభుత్వపు పోలీసు విధానం. ఈ పోలీసు విధానాన్ని ఎవరేవిధంగా విమర్శనచేసినా, దానిలో ఎటువంటి లోపాలున్నా ఒక్క విషయం మాత్రం ఎవ్వరూ కాదనలేరు. కమ్యూనిస్టుప్రభుత్వ పోలీసు విధానం, కార్మికులకు రక్షణ కల్పించి, ఆత్మవిశ్వాసమును కలిగించి, ధైర్యమునిచ్చి చైతన్యవంతులను చేసింది. వారి కాళ్ళమీాద వారు నిలబడి అన్యాయాన్ని ఎదిరించేవారి హక్కులకోసం, పోరాడగల స్తోమ తను స్థైర్యమును వారిలో కలుగజేసింది. ఇది ఎవ్వరూ విస్మరించరాని సత్యం.

అణగద్రొక్కబడి అట్టడుగునవున్న కార్మికునకు, బీద రైతుకు, సామాన్య మానవునకు, మొట్టమొదటిసారిగా తలెత్తుకొని, "మేమూ మానవులమే అని చెప్పుకొని, సగర్వంగా తిరగగల హోదా, హుందా తనము పొందేటందుకు కేరళ కమ్యూనిస్టు ప్రభుత్వ పోలీసు విధానం సహాయకారి కాగలిగింది.

కేరళలో కమ్యూనిస్టు ప్రభుత్వం చేపట్టిన ఏ యితర విధానం విఫలమైందని అన్నా సరేకాని, కేరళలోని అసంఖ్యాక బీదప్రజల హృద యాల్లో సుస్థిరమైన స్థానం సంపాదించుకోడానికి కారణభూతమైనది కమ్యూనిస్టు ప్రభుత్వ పోలీసు విధానమే అన్న సత్యాన్ని ఎవ్వరూ ఖండించలేరు.



